# మాతృకామందారమాలిక.



శ్రీమద్గ్రామజమీందార్లగు

శ్రీకందుకూరిలక్ష్మీప్రసాదరావుగారిచే

రచియింపఁబడి



మొదటికూర్పు 500 ప్రతులు

పిఠాపురము

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడెను.

1918.

# మాతృకామందారమాలిక:

శ్రీమద్గ్రాంథికవిరోధాచార్యులగు

శ్రీ కందుకూరిలక్ష్మీప్రసాదరావుగారిచే

రచియింపఁబడి

మొదటికూర్పు 100 ప్రతులు.

పిఠాపురము

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడెను.

1918.

శుభమస్తు.

# మాతృకామందారమాలిక.

1 శ్రీయునువాణియు • శివశక్తివీవె
సాయుజ్యపదవికి • సాధనంబీవె

2 మాతవునీవెనా • మంత్రంబునీవె
ధ్యాతయు ధ్యేయంబు • ధ్యానంబునీవె

3 పతియుగతియునాదు • పరదైవమీవె
అతులితసత్కర్మ • కాధారమీవె

4 భూతప్రపంచంబు • బోషించునీవె
సేవవునీవె నా • నిష్క్రియనీవె

అవిఘ్నమస్తు.

# విషయవాక్యశ్రుతులు.



1 ౧. త్రిపురోపనిషత్తు ౨. మహానారాయణ.

లజ్జామతిస్తుష్టిరిష్టాచపుష్టాలక్ష్మీరుమాలలితాలాలపంతీ॥౧

త్వమేవమోక్షదస్త్వమేవాఖిలమోక్షసాధనం॥౨।

2 ౧. తేజోబిందు ౨. కైవల్య.

అఖండైకరసామాత్రా, అఖండైకరసంమంత్రం॥౧॥

త్రిషుధామసుయద్భోగ్యంభోక్తాభోగశ్చయద్భవేత్

తేభ్యోవిలక్షణస్సాక్షీచిన్మాత్రోహంసదాశివః॥ ౨॥

3 ౧. శ్వేతాశ్వతర ౨. తేజోబిందు.

పతింపతీనాంపరమంపరస్తాద్విదామదేవంభువనేశమీడ్యం

స్వయమేవాత్మనిస్వస్థం స్వయమేవపరాగతిః॥౧॥

కర్మాధ్యక్షస్సర్వభూతాధివాసః॥౨॥

4 ౧. బృహదారణ్య ౨. మహానారాయణ ౩. శాండిల్య.

ఏషసర్వేశ్వరఏషభూతాధిపతిరేషభూతపాలః॥౧॥

త్వమేవసర్వనియంతాత్వమేవసర్వం॥౨॥

యత్సత్యమానందంనిష్క్రియంనిరంజనం॥౩॥

౩

5 దేవాదిదేవుల • దేవుండవీవె
ఈవునేననుభావింతు • నద్దియునీవె

6 నిర్భేదభావమ్ము • నిండినదీవె
దుర్భరతత్వంపుఁ • ద్రోవయునీవె

7 ఆదికనాదికి • నాదివినీవె
కాదుకాదనిపొంచఁ • గలశేషమీవె

8 కాలత్రయీబాధఁ • గాంచనిదీవె
మూలకారణమీవె • మూలంబవీవె

5 ౧ శ్వేతాశ్వతర ౨. తేజోబిందు.

తమీశ్వరాణాంపరమంమహేశ్వరంతందేవతానాంపర
మంచదైవతం॥౧॥
త్వత్తామత్తాచచిన్మయం॥౨॥

6 ౧. పాశుపతబ్రహ్మ ౨. కైవల్య.

భేదాభేదస్తథాభేదాభేదస్సాక్షాత్పరాత్మనః
నాస్తిస్వాత్మాతిరేకేణస్వయమేవాస్తిసర్వదా॥౧॥
త్వమేవంవిదిత్వాతిమృత్యుమేతినాన్యః
పంథావిద్యతేయనాయ॥౨॥

7 ౧. తేజోబిందు ౨. బృహదారణ్య.

ఆదిరంతంచచిన్మాత్రం॥౧॥
సఏషనేతినేత్యాత్మా అగృహ్యోనహిగృహ్యతే॥౨॥

8 ౧. మహానారాయణ ౨. నృసింహోత్తరతాపిని.

కాలత్రయాబాధితంబ్రహ్మ॥౧॥
ఏషసర్వేశ్వరఏషసర్వజ్ఞఏషోంతర్యా
మ్యేషయోనిస్సర్వస్య॥౨॥

9 తాపత్రయారణ్య ♦ దావాగ్ని:
లోపల వెలుపల ♦ లోనెల్లనీవె

10 పాపలనడిమింటి ♦ పరమాత్మవీవె
పోరివుంజూపించునా ♦ పోజ్యోతివీవె

11 పాపాపహంబైన ♦ బ్రహ్మంబవీవె
సోపానగతినుండు ♦ సుజ్ఞానమీవె

12 సర్వకర్మంబుల ♦ సాక్షివినీవె
దుర్వాసనాకర్మ ♦ దూలింతువీ

13 పూర్వార్జితంబగు ♦ పుణ్యంబవి వ
నిర్వికారంబును ♦ నిత్యంబు:

9 ౧. ముద్గల ౨. మండలబ్రాహ్మణ.

తద్బ్రహ్మతాపత్రయాతీతం॥౧॥
సబాహ్యాభ్యంతరేఅపరిమితద్యుతినిభంతత్వమహాకాశం॥

10 బృహదారణ్య.

యశ్చక్షుషితిష్ఠంచక్షుషోంతరోయంచక్షుర్నవేద॥౧॥
యోదేవోఅగ్నౌయోఅప్సుయోవిశ్వాభువనమావివేశ॥

11 ౧. తైత్తిరీయ ౨. మహోపనిషత్.

ఏతంహవావనతపతికిమహంసాధునాకరవం
కిమహంపాపమకరవమితి॥౧॥
సర్వాస్తాఇమాఃప్రోక్తామయాజ్ఞానస్యసువ్రత॥౨॥

12 ౧. శ్వేతాశ్వతర ౨. దేవ్యుపనిషత్.

కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస
స్సాక్షీచేతాకేవలోనిర్గుణశ్చ॥౧॥
తాందుర్గాందుర్గమాందేవీందురాచారవిఘాతినీం॥౨॥

13 తేజోబిందు.

పుణ్యంపాపంచదివారాత్రిం॥౧॥
నిర్వికారంనిరాకారంనిత్యంబ్రహ్మనిరంజనం॥౨॥

14 నిర్వ్యాజకరుణతో • నిండినదీవె
నిర్వ్యాపకంబయ్యు • నిఖిలంబునీవె

15 సర్వశక్తులనిచ్చు • సచ్ఛక్తివీవె
సర్వంబునీవె నా • సర్వేశుఁడీవె

16 సర్వవర్ణంబుల • స్థానంబవీవె
సర్వమంత్రంబుల • సారంబవీవె

17 కర్మతంత్రంబుల • కారణంబీవె
ధర్మమార్గములకు • ధననిధివీవె

18 నిర్మాత్రనిర్యంత్రి • నిస్తంత్రివీవె
ధర్మస్వరూపవౌ • తల్లివినీవె

14 దేవ్యుపనిషత్.

మహాదుర్గప్రశమనీం మహాకారుణ్యరూపిణీం॥౧॥
అహంసర్వమసర్వం,
అహంపంచభూతాన్యపంచభూతాని॥౨॥

15 ౧. గర్భోపనిషత్ ౨. శ్వేతాశ్వతరమ్.

సర్వశక్తించిదాత్మానంసర్వకారణకారణం॥౧॥
పురుషఏవేదగ్ంసర్వం యద్భూతంయచ్చభవ్యం॥౨॥

16 ౧. పంచబ్రహ్మోపనిషత్ ౨. మహానారాయణమ్.

అకారాదిస్వరాధ్యక్షమాకాశమయవిగ్రహం॥౧॥
ప్రణవాద్యఖిలమంత్రాత్మకంబ్రహ్మ॥౨॥

17 ౧. సీతోపనిషత్ ౨. దేవ్యుపనిషత్.

సర్వకర్మమయీ ... ... ౧॥
అహందదామిద్రవిణగ్ంహవిష్మతే
సుప్రావ్యేయజమానాయసున్వతే॥౨॥

18 ౧. తేజోబిందు ౨. బృహదారణ్యం.

మంత్రతఃస్తంత్రతశ్చసత్వంగోగుణదోషవిజృంభణం॥౧॥
సర్వదోషప్రభేదాచ్చనాన్యన్నాస్తీతినిశ్చిను ...
సవాఅయమాత్మాధర్మమయోధర్మమయస్సర్వమయః॥

19 ముద్రమౌనముద్రాల్పు ♦ మూకాంబవీవె
చిద్రూపధారియా ♦ చిచ్ఛక్తివీవె

20 రుద్రావతారయా ♦ రుద్రాణివీవె
ధర్మకర్మంబుల ♦ భేదింతువీవె

21 ప్రాణులయందుండు ♦ ప్రతిభవునీవె
వాణీమతల్లికి ♦ వాగ్బదమీవె

22 అలరులోకాళికి ♦ కాధారమీవె
సలలితచిద్రూప ♦ చంద్రికవీవె

23 కర్తృభోక్తృవు ♦ కారణంబీవె
మూర్తిత్రయాతీత ♦ మూలంబవీ

19 తేజోబిందూపనిషత్.

చిన్మాత్రాన్నాస్తి మానంచచిన్మాత్రాన్నాస్తి మానకం॥
చిన్మాత్రంవరమంబ్రహ్మచిన్మాత్రాన్నాస్తి కించన॥౨॥

20 ౧. మైత్రాయణి ౨. గర్భోపనిషత్.

భాస్వత్యేషాంశుదో విష్ణురిత్యధిపతిః॥౧॥
అశుభక్షయకర్తారంఫలముక్తి ప్రదాయకం॥౨॥

21 ౧. శాండిల్య ౨. దేవ్యుపనిషత్.

ప్రజ్ఞాచతస్మాత్ప్రసృతా పురాణీ॥౧॥
దేవీంవాచమజనయన్త దేవాఃస్తాంవిశ్వరూపాః
పశవోవదన్తి॥౨॥

22 ౧. యోగశిఖ ౨. మండలబ్రాహ్మణ.

ఆధారంసర్వభూతానాం అనాధారమనామయం॥౧॥
తదఖండతేజోమండలం తద్విద్యుల్లేఖావచ్ఛుక్లభాస్వరం।

23 ౧. శ్వేతాశ్వతర ౨. నృసింహోత్తరతాపిని.

భోక్తాభోగ్యం ప్రేరితారంచమత్వా సర్వంప్రోక్తం
త్రివిధంబ్రహ్మమేతత్॥౧॥
సర్వత్రబ్రహ్మావిష్ణుశివరూపిణీ॥౨॥

24 అణిమాదిసిద్ధుల • కాధారమీవె
గుణదోషవర్జిత • గుణనిధివీవె

25 ఇచ్ఛయుజ్ఞానంబు • కృత్యంబునీవె
చిచ్ఛక్తి జడశక్తి • చిత్రంబునీవె

26 శమదమాదులకెల్ల • సాధనంబీవె
విమలామనస్కుల • విజ్ఞానమీవె

27 చేతనాచేతన • చిన్మాత్రవీవె
జ్యోతిరూపంబైన • జ్యోత్స్నవునీవె

24 ౧. అద్వయతారక ౨. మహానారాయణం 3. తేజోబిందు.

తద్యోగిభిర్ధ్యేయంతస్మాదణిమాదిసిద్ధిర్భవతి॥౧॥
బ్రహ్మణోపిమాయావశాత్ సగుణపరిచ్ఛిన్నాదిప్రతీతిః
ఉపాధివిలయే నిర్గుణనిరవయవాదిప్రతీతిః.
సర్వదోషపరిభేదాశ్చనాస్త్యనాత్మేతినిశ్చయః॥

25 ౧. సీత ౨. తైత్తిరీయం.

సాదేవీత్రివిధాభవతి ఇచ్ఛాశక్తిః క్రియాశక్తిస్సాక్షా
చ్ఛక్తిరితి॥౧॥
సత్యత్యచ్చాభవత్ నిరుక్తంచానిరుక్తంచ నిలయనంచా
నిలయనంచ విజ్ఞానంచా విజ్ఞానంచ సత్యంచానృతంచ
సత్యమభవత్॥౨॥

26 ౧. మహా ౨. నారాయణ.

త్వమేవమోక్షదస్త్వమేవాఖిలమోక్షసాధనం॥౧॥
అమితవేదాంతవేద్యంబ్రహ్మత్వమేవసదాధ్యేయః॥౨॥

27 ౧. సీతా ౨. యోగశిఖ.

దేవేశస్యభిన్నాభిన్నరూపాచేతనాచేతనాత్మికా॥౧॥
జ్యోతిషామపితజ్జ్యోతిస్తమఃపారేప్రతిష్ఠితం॥౨॥

28 పంచవింశతితత్వ♦భావంబునీవె
ప్రాంచదేకాక్షుకి♦పరమార్థమీవె

29 భావభావాభావ♦భావంబవీవె
కైవల్యసంధాన♦కామంబవీవె

30 భూతభవద్భవ్య♦మూర్తివినీవె
ఓతవై ప్రోతవై♦యొప్పనదీవె

31 ప్రథమవర్ణంబగు♦ప్రణవంబవీవె
శ్రీఖితతత్వమసివ్రి♦భామయివీ

28 ౧. మండలబ్రాహ్మణ ౨. శేవ్యుపనిషత్.

జీవఃపంచవింశకఃస్వకల్పితచతుర్వింశతితత్వాం
పరిత్యజ్యషడ్వింశఃపరమాత్మా॥౧॥
వియదీకారసంయుక్తంవీతిహోత్రసమన్వితం
అర్ధేందులసితందేవ్యాబీజంసర్వార్థసాధకం
ఏవమేకాక్షరంమంత్రంయతయశ్శుద్ధచేతసః
ధ్యాయంతిపరమానందమయాజ్ఞానాంబురాశయః॥౨॥

29 ౧. ఆత్మోపనిషత్ ౨. బ్రహ్మవిద్య.

విద్యావిద్యాదిభేదేనభావాభావాదిభేదతః
గురుశిష్యాదిభేదేనబ్రహ్మైవప్రతిభాసతే
సత్యకామస్సత్యసంకల్పః॥౨॥

30 ౧. నారాయణ ౨. తేజోబిందు.

యస్మిన్నిదగ్ంసంచవిచైకగ్ంసఓతప్రోతశ్చవిభుఃప్రజాసు
భూతంభవ్యంభవిష్యచ్చసర్వంచిన్మాత్రమేవహి॥౨॥

31 ౧ బ్రహ్మవిద్య ౨. మండలబ్రాహ్మణ.

ఓమిత్యేకాక్షరంబ్రహ్మయదుక్తంబ్రహ్మవాదిభిః॥౧॥
తదనునిత్యశుద్ధఃపరమాత్మాహమేవేతితత్వమసీత్యుపదేశే
న త్వమేవాహంమహమేవత్వమితితారకయోగమార్గేణ
అఖండానందపరిపూర్ణఃకృతార్థోభవతి॥౨॥

32 పంచభూతంబుల • పరమాత్మవీవె
ఎంచశక్యముగాని • యేరూపమీవె

33 నాదబిందుకళల • నట్టింటివీవె
వేదాన్తవేద్యవై • వెలుఁగొందుదీవె

34 సంసారశృంఖలా • సంస్కర్తవీవె
త్వంసర్వమనవెల్గు • తల్లివినీవె

35 మాతృపితృభ్రాతృ • మమతలునీవె
మాతృకకాదియా • మాతృకవీవె

36 ఆత్మవనాత్మవు • హంసవునీవె
ఆత్మానాత్మకంబైన • యమ్మవునీవె

32 ౧. కైవల్య. ౨. స్కంద.

ఏతస్మాజ్జాయతేప్రాణో మనస్సర్వేంద్రియాణిచ
ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధారిణీ॥౧।
త్వమేవసర్వస్వరూపః॥

33 ౧. యోగశిఖ ౨. మహానారాయణం.

బిందునాదకలాజ్యోతిరబిందుర్ధ్రువతారకం
శాన్తంచతదతీతంచపరబ్రహ్మతదుచ్యతే॥౧॥
త్వమేవానన్తోపనిషత్సద్గ్రాహ్యః॥౨॥

34 ౧. రామతాపిని ౨. దేవి ౩. శ్వేతాశ్వతర.

గర్భజన్మజరామరణసంసారమహద్భయాత్సంతారయతీతితారకం॥౧॥
ఏకైవవిశ్వరూపిణీతస్మాదుచ్యతేనైక
పురుషఏవేదగ్ంసర్వం॥

35 ౧. తేజోబిందు ౨. దేవ్యుపనిషత్.

అఖండైకరసామాతా అఖండైకరసఃపితా॥౧॥
మంత్రాణాంమాతృకాదేవీశబ్దానాంజ్ఞానరూపిణీ॥౨॥

36 ౧. నృసింహతాపిని ౨. బ్రహ్మవిద్య ౩. సుబాల.

సర్వంనిరాత్మకమాత్మసాత్కరోతితస్మాత్పరఏవైకః
హంసహంసేతియోబ్రూయాద్ధంసోనామమహాశ్శివః॥౧॥
సోయమాత్మేతమాత్మానముపాసీత॥౨

-----

37 పూర్వాపూర్వంబుల • పూర్వంబవీవె
సర్వస్వరూపమా • జగదంబవీవె

38 తత్వతత్వంబుల • తత్వంబవీవె
సత్వరజస్తమ • చ్ఛాయవునీవె

89 కాలకాలములందుఁ • గలజ్ఞానమీవె
కాలచక్రముద్రిప్ప • కారణంబీవె

40 ధర్మార్థకామప్ర • దాయినివీవె
నిర్మమనిర్మోహ • నిర్లేపవీవె

41 జననమరణముల • చవిఁజూతువీవె
తనుఁదాననిలిచిన • తల్లివినీవె

37 ౧. కైవల్య ౨. సీతోపనిషత్.

పురాతనోహంపురుషోఽహమీశోహిరణ్మయోహం
శివరూపమస్మి॥౧॥
సర్వలోకమయీసర్వశక్తిమయీసర్వమయీ॥౨॥

38 ౧. తేజోబిందు ౨. దేవ్యుపనిషత్.

చిన్మాత్రాస్మ్యస్మితత్త్వంచ॥౧।
నైషాసత్వరజస్తమాంసి॥౨॥

39 ౧. శ్వేతాశ్వతర ౨. సీతోపనిషత్.

యఃకారణానినిఖిలానిఖానికాలాత్మయుక్తాన్యధితిష్ఠత్యేకః
సర్వాధారమయీకార్యకారణమయీ నిమేషమారభ్య
వరార్థపర్యంతంకాలచక్రంజగచ్చక్రమిత్యాదిప్రకారేణ
పరివర్తమానా॥౩॥

40 ౧. త్రిపురోపనిషత్ ౨. తేజోబిందు.

చతుర్వర్గప్రదాయినీ॥౧॥
లోభంమోహంభయందర్పంకామంక్రోధంచకిల్బిషం
ఏతద్భావవినిర్ముక్తంతద్బ్రహ్మబ్రహ్మతత్పరం॥౨॥

41 ౧. కఠ ౨. బృహదారణ్య.

స్వయంమృత్వాస్వయంభూత్వాస్వయమేవావశిష్యతే॥
యదాసర్వేప్రముచ్యంతేకామాయేస్యహృదిస్థితాః
అథమర్త్యోమృతోభవత్యత్రబ్రహ్మసమస్నుతే॥౨॥

42 తతదేశకాలపా♦త్రంబులునీవె
సతతసృష్టిస్థితి♦విలయంబులీవె

43 ఇతిహాసములుశ్రుతి♦స్మృతులెల్లనీవె
వెతఁబాసిగతిఁజూపు♦విజ్ఞానవిగావె

44 యావద్బ్రార్థస్వ♦రూపంబునీవె
దీపింపఁజేయునీ♦తేజంబునీవె

45 ఇందునందునునీవె♦యెందునునీవె
యుందువానంతవై♦యుండినదీవె

46 గంగవాణియుమున♦గలయుకూటమునఁ
బొంగుచునుందువు♦పూర్ణేందువదన

42 ౧. మహానారాయణ ౨. సీతోపనిషత్.

దేశకాలవస్తుతురీయసంజ్ఞానిత్యపరిపూర్ణః॥౧॥
ఉత్పత్తిస్థితిసంహారకారిణీసర్వదేహినాం
సీతాభగవతీజ్ఞేయామూలప్రకృతిసంజ్ఞితా॥౨॥

43 ౧. బృహదారణ్య ౨. బ్రహ్మవిద్య.

అరేఅస్యమహతోభూతస్యనిశ్వసితమేతద్యదృగ్వేదో యజు
ర్వేదస్సామవేదోఅథర్వాంగిరసఇతిహాసఃపురాణం॥౧॥
చోదకోమోదకశ్చైవమోక్షకశ్చపరస్మృతః॥౨॥

44 ౧. తేజోబిందు ౨. శ్వేతాశ్వతర.

రూపాతీతస్వరూపోస్మిపరమాకాశవిగ్రహః॥౧॥
తమేవభాంతమనుభాతిసర్వంతస్యభాసాసర్వమిదంవిభాతి॥

45 ౧. బ్రహ్మవిద్య ౨. తైత్తిరీయ.

అహమేవాధస్తాదహముపరిష్టాదహంపశ్చాదహంపురస్తా
దహందక్షిణతఅహముత్తరతః॥
ఆనందోబ్రహ్మేతివ్యజానాత్।

46 యోగశిఖ.

ఆధారేపశ్చిమేభాగేత్రివేణీసంగమోభవేత్
తత్రస్నాత్వాచపీత్వాచనరఃపాపాత్ప్రముచ్యతే॥

47 సత్యస్వరూపైక • పటోఁగనిలయ
తత్త్వార్థినైనిన్నుఁ • దల్లినుతింతు

43 నామనోధనముచు • నావాక్యసమితి
నామహోద్యమమును • నాశక్తివీవె

49 లలితపంచాశద్ధ • లత్పుష్పహార
మలరుపేర్మిమవుననీ • కర్పించినాఁడ

50 నిత్యమంగళమైన • నీగళసీమ
నిత్యంబుఁ దాల్చిమ • న్నించుమాతల్లి.

శ్రీకందుకూరి ల • క్ష్మీప్రసాదాఖ్యుఁ
డై కొన్ననీపాద • కమలసేవకుఁడ.

సమాప్తము.

